# పురుష లక్షణం

people may forget what you said ,people may forget what you did,but they will never forget how you made them feel. - Maya Angelou

Thursday, May 3, 2012

## స్క్రీన్‌ప్లే ఉపకరణాలు : నాటకీయత



స్క్రీన్‌ప్లే ఉపకరణాల గురించి మరింత వివరణాత్మకంగా ఈ వ్యాసాల్లో తెలుసుకుందాం. కథకి హృదయంలాంటిది అనదగ్గ నాటకీయత గురించి మొదటగా తెలుసుకుందాం. శాస్త్రాన్ని అధ్యయనం చేసేప్పుడు దానిలో సాంకేతికపదాల పట్ల ప్రాథమిక అవగాహన ఎంతో అవసరం. ముందు ముందు మీరు ఈ విషయాన్ని గుర్తిస్తారు. అసలు మనం ఉపయోగించే భాషలో చాలా పదాలకి అర్థాలు తెలియకుండా మాట్లాడేస్తాం వ్యవహారికంలో దాని వల్ల మనకి నష్టం లేనప్పటికీ, ఏదైనా విద్యనో, శాస్త్రాన్నో అభ్యసిస్తున్నప్పుడో, అధ్యయనం చేస్తున్నప్పుడో ఆయా శాస్త్రాల్లోని సాంకేతికపదాల పట్ల కనీస అవగాహన లేకపోవటం ఎంతో నష్టం కలుగజేస్తుంది.

డ్రామా అనే పదాన్ని మనం సాధారణంగా తప్పుగా అర్థం చేసుకుంటాం. చలనచిత్రాలకు సంబంధించిన విద్యని ఎంతో డబ్బు పెచ్చించి నేర్చుకున్న విద్యార్థులతో చర్చించినప్పుడు, వారు డ్రామా అనే పదాన్ని నిర్వచించలేకపోయారు. డ్రామా అనే పదాన్ని నాటకంగా అర్థం చేసుకునే వారే ఎక్కువ మంది కనిపించారు, ఇంకొంత మంది నటనగా భావిస్తే మరికొంత మంది దాన్ని కుటుంబ కథల్లో వుండే రాగద్వేషాలు అనుకుంటున్నారు. ఐతే ఈ నాటకీయత గురించి లోతుగా తెలుసుకుంటే మనకి ఎన్నో ఆసక్తికరమైన విషయాలు కనిపిస్తాయి.

**నాటకీయత (Drama) :** (చర్య చేయాల్సి వచ్చినప్పుడు) పరస్పర విరుద్ధమైన ప్రేరణల వల్ల బహిర్గతమయ్యే భావోద్వేగాల వల్ల కలిగే సంఘర్షణే నాటకీయత.

**సంఘర్షణ అనేది ప్రత్యేకమైన ఉపకరణం కాబట్టి దాని వివరాలు సందర్భం వచ్చినపుడు తెలుసుకుందాం.

ఈ డ్రామా అనే పదం గ్రీకు పదం Drao నుండి పుట్టింది. డ్రావో అంటే to do ( చర్య - Deed or action) అని అర్థం. ఐతే దీన్ని ఈ విధంగా అర్థం చేసుకుంటే మన అవగాహన ఉపరితలాన్ని పరిశోధించి సంతృప్తి పడినట్టుంటుంది. విద్య యొక్క ఉద్దేశం లోనున్న వాటిని బయటికి తీయడం. దీన్ని లోతుగా పరిశీలిస్తే డ్రామా అనే పదంలో వున్న అసలైన అర్థం, దాని ఉపయోగం మనకి తెలుస్తుంది.

వాస్తవ జీవితంలో మనకి ఇష్టం వుంటే చర్య (పని కాదు) చేస్తాం లేదంటే ఖాళీగా ఉంటాం. కానీ సినిమా కథలో హీరో ఏ చర్య చేయకుండా ఓ అరగంట కూర్చున్నట్లయితే ప్రేక్షకులు గోడలు, కిటికీలు. తలుపుల వైపు చూస్తూ కూర్చుంటారు (ఆర్ట్ సినిమాల్ని ఆరాధించే ప్రేక్షకులు తప్ప), ఇదే ఇంకాసేపు కొనసాగితే ఏదో మిషతో బయటికెళ్లి అట్నుంచటు వెళ్ళిపోతారు తిరిగి సినిమాహాలు వైపు కూడా చూడటానికి ఇష్టపడరు. చర్యకి సినిమాలో ఎంతో ప్రాముఖ్యత ఉంది. మరి అలాంటి చర్య చేసేప్పుడు అది సాదాసీదాగా వుంటే దాన్లో ఆసక్తి

Blog Archive



About Me



Aaditya Chowdary Mulpuri

Those that know do,Those that understand teach.

View my complete profile

My Blog List

గురుకులం



అఖిలాండకోటి బ్రహ్మాండ నాయక రాజాధిరాజ యోగిరాజ పరబ్రహ్మ సమర్థ సద్గురు శ్రీ శిరిడీ సాయినాథ మహరాజ్ కీ జై - ఓం శ్రీ సమర్థ సద్గురు సాయినాథాయ నమః *శిరిడీ సాయి బాబా జీవితంలో ముఖ్యఘట్టాలు*: 1.మొదట 16 సంవత్సరాల బాలుడిగా ప్రకటితమైన సంవత్సరం - 1854(వేప చెట్టు - ప్రస్తు...

*2 years ago*

ప్రకృతి & సౌందర్యం



కల్లోలం... - కలలు.. నిజం కావు ఎందుకో తెలీదు.. కల మధురం, ఐనా ఆయుష్షు అల్పమే అని తెలీదు.. తెలిసీ తెలియని వాస్తవాలే కలలై...కరుగుతాయని

ఏముంటుంది? (మొదటి వ్యాసంలో Entertainment నిర్వచనం చూడండి) ఆసక్తి కలగాలంటే కథానాయకుడు చేయాల్సిన చర్యలోనే ఏదో ఆసక్తి కలిగించాలి. అదేమిటో తెలుసుకుందాం.

నాయకుడున్నాడు చాలా మంచి వాడు. ప్రతినాయకుడు ఖచ్చితంగా చెడ్డవాడే. ఏదో వ్యాపారవ్యవహారాల్లో ఇద్దరికి తగువొచ్చింది. కొట్టుకున్నారు ప్రతినాయకుడు చచ్చాడు, నాయకుడు గెలిచాడు. చాలా సాదాసీదా సంఘర్షణ. దీన్ని చూడటానికి సమయము డబ్బు ఎవడు వెచ్చిస్తాడు? అందుకే పెద్దలు కథలో నాటకీయత అనే ఉపకరణం యొక్క ఉపయోగం గుర్తించి దాన్ని ఎలా ఉపయోగించాలో కూడా తెలియజేసారు. ఇది కథలో ఏ సందర్భంలో ఏర్పడితే నాటకీయత తన ఉచ్ఛస్థితిని పొందుతుందో కూడా నిరూపించి చూపించారు. నాయకుడు చర్యకి దిగేటప్పుడు అతనికి పరస్పర విరుద్ధమైన ప్రేరణలు కలుగుతాయని నిర్వచనంలో చెప్పుకున్నాం. దీన్ని ఒక్క పదంలో ఎంపిక అనుకోవచ్చు. రెండు పరస్పర విరుద్ధమైన దారులు నీకు లక్ష్యసాధనలో ఎదురయినప్పుడు వాటిల్లో దేన్ని నీవు గమ్యాన్ని సాధించే మార్గంగా ఎంచుకుంటావో అదే నీ భవిష్యత్తుని నిర్ణయిస్తుంది. ఇవి రెండు రకాలు.

1.అత్యవసరమైన రెంటిలో ఒకటి మాత్రమే ఎంచుకోవల్సి రావడం. (అవసరం)
2.ప్రాణాంతకమైన రెంటిలో ఒకటి తప్పనిసరిగా ఎంచుకోవల్సి రావడం. (భయం)

ఈ రెంటిలో ఒకటి కథ ప్రారంభంలో (12 Sequences వ్యాసం చదవండి) , రెండవది కథ ముగింపులో మూడవది అరుదుగా కథ మధ్యలో రావడం జరుగుతుంది. ఈ ఎంపికల్లో మొదటిది మనిషికి ఉండే అవసరాన్ని తెలియజేస్తే రెండోది అతని భయాన్ని గుర్తుచేస్తుంది. కాబట్టి మొదటిదాన్ని అవసరంగాను, రెండోది భయంగాను భావిస్తూ వీటిని అర్థం చేసుకునే ప్రయత్నం చేద్దాం. దీన్ని **principle of dilemma**(ధర్మ సంకటం) అంటారు. మంచికి, చెడుకి మధ్య వ్యత్యాసాన్ని మనం మూడు విధాలుగా వర్గీకరించవచ్చు.

1.ఈ సంకటం మంచికి, చెడుకి (Good vs Evil) మధ్య ఏర్పడినపుడు ఈ రెండిటి మధ్య విభజన రేఖ స్పష్టంగా వుంటుంది కనుక అర్థం చేసుకోవటానికి సులువుగా వుంటుంది.
Ex: యాక్షన్ సినిమాలు అన్నీ ఈ కోవలోకే వస్తాయి.

2.ఈ సంకటం ఇద్దరు మంచి వ్యక్తుల మధ్య లేదా రెండు సరైన సిద్ధాంతాల (Good vs Good - మంచికి, మంచికి) మధ్య ఏర్పడినపుడు దీన్ని అర్థం చేసుకోవటం ఒకింత కష్టంగా వుంటుంది. ఇవి పరిణతి చెందిన కథలు.
Ex : Crimson Tide, Kramer vs Kramer

3.ఈ సంకటం ఇద్దరు చెడుదారిలో (Evil vs Evil) నడిచే వ్యక్తుల మధ్య ఏర్పడినపుడు వీరిలో మంచివైపు నడిచే వ్యక్తెవరో మనం ఆసక్తిగా గమనిస్తాం. ఎంచేతంటే మనిషి మనసు స్వతహాగా మంచిని స్వీకరించే విధంగా రూపొందించబడింది. ఎదుటవారిలో చెడుని వెదికినంత సులువుగా మనిషి తనలో వెదకలేడు. సినిమాలాంటి కళలో ఎవరు మంచి వైపు నడుస్తారో అతన్నే కథానాయకుడిగా మనసు అంగీకరిస్తుంది.
లేదా వ్యవస్థలో ఉండే లోటుపాట్లని వెదికి వాటిని చక్కదిద్దుకునే అవకాశం ఇచ్చే మేధావుల్ని, తెలివైన వారిని వారు చెడు నడత కలిగినా మనం వారికి ఆకర్షితులమవుతాం.
Ex: The Godfather, The Usual Suspects

**1.అవసరం :** దీన్లో నాయకుడుకి రెండూ అవసరమే కానీ ఒకటి మాత్రమే ఎంచుకునే అవకాశం ఉంది. దీనికి మంచి ఉదాహరణ గాడ్‌ఫాదర్ సినిమా. a).ఈ సినిమాలో హీరోకి తన మాఫియా కుటుంబనేపథ్యం నచ్చక సైనికుడిగా గుర్తింపు పొందాలనుకుంటాడు. ఇది అతని ఆశయం. b). ప్రత్యర్థుల చేతిలో తండ్రి గాయపడి మరణావస్థలో ఉండగా తండ్రి ప్రాణాన్ని కాపాడాల్సిన అన్న తండ్రి స్థానానికి తనే వారసుడ్నని నిరూపించుకునే పనిలో వుంటాడు. మాఫియా మిత్రులెవరూ సహకరించని స్థితిలో ఖచ్చితంగా సైనికుడవ్వాలనే తన ఆశయాన్ని పక్కకుపెట్టి తండ్రిని రక్షించుకోవటంతో పాటు తన కుటుంబాన్ని తర్వాత మాఫియా సామ్రాజ్యాన్ని (వ్యాపార భాగస్వాములతోసహా) రక్షించుకోవటంలో భాగంగా క్రమంగా అతనూ మాఫియా గాడ్‌ఫాదర్‌గా ఎదుగుతాడు. ఇది ఇతను ఎంచుకున్న దారి.

తెలీదు.. నిదుర లేచాక స్వప్న...
*1 year ago*

**ప్రణుతి**



12.దత్తావధూత సమర్థ సద్గురు నాయుడు స్వామి మహరాజ్ (లక్ష్మీ పురం, కర్నూలు జిల్లా) - నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షి శిరోరుబాహవే సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటి యుగధారిణే నమః మహామౌని మౌన ప్రబోధాకృత దక్షిణామూర్తి పేదపేదాం...
*6 months ago*

**భక్తి & భగవంతుడు**



3/A.భగవంతుడు (ఆధ్యాత్మికం) - విఘ్నేశ్వరునికి - సరస్వతి మాతకి నమస్కారం - శ్రీ గురుభ్యో నమః గురుదేవులు సమర్థ సద్గురు సాయినాథ మహరాజుకి, దత్తావధూత సమర్థ సద్గురు నాయుడు స్వామి మహ...
*4 months ago*

**భాష & భావన**



స్పందన - శాంతి, స్వచ్ఛత, అణకువ, విధేయత ఇస్లాం పదానికి అర్థం అరబిక్ పదం సలేమా నుండి పుట్టింది... నువ్వెక్కడ పుట్టావు.. ఎక్కడ పెరిగావు.. నీ మూలమేది.. ఈ దేశం తిండి...
*4 months ago*

**సాహితీ వనం**



భావన - యుగాలు క్షణాలై కాలం గతించిపోనీ, నేను నీవను భావన, నీలో కరిగిపోనీ. - మూల్పూరి. ఆదిత...
*1 year ago*

**Followers**

Join this site
with Google Friend Connect

**Members (3)**



Already a member? Sign in

**2.భయం :** ఇదే సినిమాలో కథ ముగింపుకి వచ్చే సరికి ఎవరికోసమైతే తను మాఫియాడాన్ అయ్యాడో ఆ కుటుంబసభ్యులు + మాఫియా మిత్రులు శత్రువులతో కుమ్మక్కయి అతన్ని చంపాలనుకుంటారు. ఇక్కడ ఇతనికి ఎదురయిన ఎంపిక a).శత్రువులతో పాటు, వ్యాపార భాగస్వాములు (మిత్రులు), వ్యతిరేకులైన కుటుంబ సభ్యుల్ని చంపి తన ఉనికిని నిలబెట్టుకోవాలి   లేదా b).తన తండ్రి తర్వాత తను మాఫియా సామ్రాజ్యానికి సరైన వారసుడు కాదనే వారి వాదన ఒప్పుకుని - వ్యాపారాన్ని శత్రువులకి, తనని వ్యతిరేకించే  భాగస్వాములకి అప్పగించి ప్రాణాలు కోల్పోవాలి. యుద్ధంలో కుటుంబసభ్యులని, మిత్రులని పోగొట్టుకోవల్సినపుడు అర్జునుడు ఎంతగా నిస్పృహ చెందాడో యుద్ధరంగాన్ని ఒదిలిపెళ్లడానికి కూడా ఎలా సిద్ధపడ్డాడో మహాభారతంలో వ్యాస మహర్షుల వారు హృదయానికి హత్తుకునేలా తెలియజేసారు. అదే స్థితి ఇక్కడ నాయకుడికి ఎదురుయింది. తప్పనిసరి పరిస్థితుల్లో తన భాగస్వాముల్ని, మిత్రుల్ని, కుటుంబసభ్యుల్ని కూడా అతను చంపడానికి సిద్ధపడతాడు.

ఇది అతను ఎంచుకున్న దారి. మరి ఈ దారిలో ప్రయాణించిన అతను చివరికి జీవితం గురించి ఏదో సత్యం (ఇతివృత్తం) తెలుసుకోవాలి కదా. ఈ కథలో చివరికి అతను తెలుసుకునేదేమిటంటే - మనం ఏర్పరచుకునే భ్రమలే వాస్తవాన్ని కనపడకుండా చేసి మనల్ని ఒంటరిని చేస్తాయి. వాస్తవం చూడలేని వ్యక్తి శాశ్వతంగా ఆనందానికి దూరం అవుతాడు.

నాటకీయతని ఎలా చెప్పుకోవచ్చంటే మనం తప్పకుండా ఏదైన సాధించాల్సిన పరిస్థితి ఎదురైనప్పుడు విధి (నాటకీయత) మనకి పరస్పర విరుద్ధమైన రెండు అంశాల్లో ఒకదాన్ని ఎంచుకునే అవకాశాన్ని ఇస్తుంది. వీటిల్లో ఏది ఎంపిక చేసుకుంటావో అదే నీ భవిష్యత్తుని నిర్ణయిస్తుంది. to do అనడంలో to do or not to do అనే ఎంపిక అంతర్లీనంగా ఉంది. ఇప్పుడు మనకి అందుబాటులో ఉన్న సినిమాలు ముఖ్యంగా నిపుణులైన వారు తయారుచేసిన సినిమాలు చూచినట్లయితే వారు నాటకీయతని ఎంత గొప్పగా ఉపయోగించారో చూచి, నేర్చుకోవచ్చు.

ముందు ముందు మరిన్ని ఉపకరణాల గురించి వీలైనప్పుడు తెలియజేస్తాను.

- మూల్పూరి. ఆదిత్య చౌదరి.
(greenlong2498@gmail.com)

Posted by Aaditya Chowdary Mulpuri at 5:45 PM 

Recommend this on Google

## No comments:

## Post a Comment

Enter your comment...

**Comment as:** Aaditya Chowdary Mulpuri (Google) Sign out

Publish Preview Subscribe by email

## Links to this post

Create a Link

